ములకు ఫలములు, మహాత్ములకు రోగములు తప్పక తటస్థించినచో భగవంతుడొకడు గలడని మానవులకు తలంపే యుండకపోవునేమో!

కమల కళ్యాణముజరిగి వత్సరము గతించినది. ఈవత్సరములో భాస్కరరావునకు తలిదండ్రులు గతించి యింటిపెత్తనమును, కమలకు 'నా' యను తల్లిగతించి మాతృగృహ సావ్యత్యమును తటస్థించినవి. ఇట్టి అనివార్యములును, విధిప్రేరితములగు కష్టములు తటస్థించినను ఆ నూత్నదంపతుల జీవిత మవిచ్ఛిన్నముగ రెండవవత్సరము సాగినది. సంతతికై వ్రతములొనర్చి, కడుపు చలువకొరకు తపస్సు దారపోయు భారతస్త్రీకి తానొక బిడ్డతల్లి కానున్నదని తెలుసుకొనుటకన్నను వేరొక సంతోష ముండబోదు. అందువలననే సంతాననిరోధ ప్రచారములు, ఆర్థికమాంద్యము, నిరుద్యోగసమస్యలు వారి చెవినిపడి, దృక్పథమునపడక, ఊహాతీతమై పోవుచున్నవి.

పాపము! కమలకుమాత్రమీ సంతోషముతో పాటు విషాద మాచ్ఛాదించినది. ఆమె గర్భము దాల్చినదిమొదలు వైద్యులపరిశీలనవలకు, ఔషధసేవ వలకు పాలుగాని దినమొక్కటిలేదు. ఆమె ఎంతటి పథ్యపానములకు కట్టుబడినను శరీరస్థితి స్వస్థత చెంద లేదు. తానున్న యింతటి దుర్బల స్థితిలో తనకు సుఖ ప్రసవము గలుగునా? కలిగినచో జన్మించినశిశువు దక్కునా? మున్నగుసంశయము లామెను పట్టిపీడించి అహోరాత్రములు చిత్తశాంతిలేకుండ చేసినవి. దీనికి తోడాయమ తనభర్త వడవడికలో నొకవింతమార్పు కనిపెట్టినది. ఇదివరలోవలె భర్తదగ్గరజేరి మనోధైర్యము కలుగచేయుటకై ప్రోత్సహించుట మున్నగునవి లేవు. క్రమముగా నతనిదర్శనమే దుర్లభమౌటచే ఆమెకు దుర్బలత్వమునకుతోడు మనోవేదన పైదోడయినది.

* * * *

కష్టము లొంటరిగారావు. కమలకు జన్మించిన పుత్రుడు నామకరణము కాకమునుపే నామమాత్రా వశిష్టుడై గతించెను. తన భర్తృభావిప్రేమ కేనిపై నాధారపడియున్నదో, నిరంతరము తా నేదానికై వేయిదేవుళ్లకు మ్రొక్కుచుండెడిదో అట్టి తన గర్భ ఫలము అందరానిదౌటచే కమలకంటికి మంటికి నేక ధారగ నేడ్చుచుండెను. 'చచ్చెడివారి కేడ్చెదరు చావకయుండెడివారి భంగి' అన్న వేదాంతవాక్య మంద రెరింగినదే. కాని ఆచరణలోనికిమాత్రము తేవడముకష్టము. తేలేము.

నాడు భాస్కరరావు ఏదో తనకువలసిన పుస్తక మునకై బీరువా వెదకుచుండెను. కమల మంచము పట్టినతరువాత అతడు కొంతసేపయినను ఇంటనిలుచుట కిదియె ప్రథమము. సమయముకనిపెట్టి కమల ఆగదిలో ప్రవేశించి, అతనితో సంభాషణ కుపక్రమించెను.

"దేనికొరకై వెదకుచున్నారండీ?"

"నేపడిన బురదగుమ్మినుండి తప్పించుకొను ఉపాయమునకై వెదకుచున్నాను. తెలిసినదా?"

"తమకంతటి మనోవ్యాకులత కలుగజేసే విషయ మేమో నాతో చెప్పరాదా? నావలన లోప మున్నచో సవరించుకొనుట కవకాశ ముండును గదా?"

"లోపము నీదికాదు నాదే. నిన్ను పెండ్లిచేసు కొనేముందు కొంచెం బుద్ధినుపయోగించి ఆలోచింప వలసి యుండెడిది, కాని నాడు నా తెలివి తెల్లవారినది. నేడు దాని ప్రతిఫల మనుభవిస్తున్నాను."

"త్రికరణశుద్ధిగ నాకర్తవ్యమును నెరవేర్చుకొను టకై యత్నించితిని యత్నించుచున్నాను. ఇంకను నావిహితకృత్యములలో తమకు లోపము కనబడుట నాదురదృష్టము."

"నీనడవడికలో లోపమని నేననలేదు. రోగ భూయిష్టవగు నీమూలమువగాని లేకున్న నాపుత్రునకు

పేరు పెట్టుటకుమున్నే నూరేండ్లు నిండియుండునా? ...సరే... జరిగిన దేదియో జరిగినది. ఇంకనూ గతజల సేతుబంధన మేల?... నాజీవితమంతయు ఒక కునిష్టికి ధారపోయుట అసంభవము. నాభావిజీవితాన్ని కంటకరహితంగా చేసుకొనేదారి నేను చూసుకొంటాను. నేటినుండి నీయథేచ్ఛను నీవు ప్రవర్తింపవచ్చు. నా యభ్యంతరము లేదు."

"ప్రేమ స్వార్థలాభకాంక్షి. నిజమే. లేకున్న దైవవశమ్మున నాకనారోగ్యము కలుగుటయు, మన ప్రణయమున కింతటి చాంచల్యము కలిగించుటయు ఏమని తలంచవలయును? 'నిలకడమున్న, తాల్మివహి, నేస్తముదబ్బర...' అని ముద్దుపళని పురుషులస్వాభావికము నెంతటి స్వానుభవముతో నుద్ఘోషించినదో? మన వివాహమునకుపూర్వము మీరాడిన లాలనవాక్యములకు, నేడుపల్కిన నిష్ఠురపువాక్యములకు గల వ్యత్యాసమును పరికించినచో తెలియగలదు. మనకు గల ప్రేమబంధ మగ్నిసాక్షిగా జరిగిన ప్రమాణముగాని తాత్కాలికపు నటన కాదు. కష్టములు కాపురముండవు. నేడు గాకున్న నెలదినములలోనైన నే నారోగ్యము బడయగలను. చెట్టునకు కాచిన కాయలన్నియు ఎట్లు దక్కవో అట్లే కలిగినపిల్లలందరూ చిరంజీవులగుదురన్నమాట అరుదు. ఇంతమాత్రమున నన్ను పరిష్కరించుట న్యాయము కాదు."

"నీచదువు కట్టిపెట్టు. 'త్యజన్తి భార్యాం దశపుత్ర మాతరమ్' భార్య అనుకూలంగాలేనప్పుడు పదిమంది బిడ్డల తల్లియైనప్పటికి విడచిపెట్టమన్నారు. ఈపాటే వాడికి నే తేవరకం లేదు."

"నేను ప్రతికూలంగా నడచేసందర్భం ఒక్కటి నిదర్శనంగా చెప్పమనే కదటండీ ప్రార్థిస్తున్నది."

"ప్రతికూలమేమిటి నాఖర్మం."

"ఏనాడు పరస్త్రీలను సోదరీభావముతో చూడటం మానివేశారో, ఏనాడు మీహృదయపీఠమున పరస్త్రీలకు తావు లభించిందో ఆనాడే మన ప్రేమలతకు చేదుపురుగు పట్టింది. పురుగో లతో నాశన మొందుటయే గాని గత్యంతరము లేదు. మనసు విరిగినతరువాత అతికడం కష్టం. ఒల్లనన్న మిమ్మల్ని పట్టి పెనుగులాడటం, అంకురిస్తున్న మీ నూతనప్రణయానికి అడ్డు తగలడం, మీభావిజీవితాన్ని దుఃఖపూరితంగా చేయటం, నాస్థాన మాక్రమించుకోబోయే నాభాగ్యవతి కపచారమొనర్చడం తప్పు. ఇది దుర్ఘటననుండి తప్పింపలేదు. భగవంతుడిచ్చిన అవయవములు సక్రమముగా నున్నంతకాలము కష్టపడి పొట్టపోషించుకోగలను. సృష్టిలో ఉదరనిమిత్తం ఒకజీవి మరియొక జీవిపై నాధారపడుట నికృష్టజన్మగా పరిగణింపబడు పశుపక్ష్యాదులలో సహితము లేదు. అట్టియెడ మానవమాత్రులకిది అసాధ్యము కాదు. లేనిచో మందో, మాకో, నూయియో, గోయియో చూచుకొని కడతేరగలను. ఇకనైనా నన్ను విడచి, మీ భావిజీవితాన్ని కంటకరహితంగా చేసుకోనండి అంతే. ధన్యవాదాలు." అంటూ కట్టుబట్టలతో 'నా' అన్నవారులేని విశాల ప్రపంచములోనికి వెడలిపోయింది తిరస్కృత ప్రణయిని కమల.

* * * *

భాస్కరరావునకు ద్వికళత్రయోగము సిద్ధించినది. సిద్ధించకేమి మగమహారాజులకు? భార్య కలదన్న విచక్షణ ద్వితీయవివాహము చేసుకొన సంకల్పించుకొన్నవాళ్లకి లేక, చేసేవాళ్లకి లేక, పిల్లనిచ్చేవాళ్లకి లేనప్పుడు మరి వివాహములకేమి విరామము? "కొనెడువారుంటచేతనే గోవులవధ, త్రాగువారుంటచేతనే తాళ్లగీత" అన్నట్లు పిల్లనొసంగువారుండుటచేతనే పెండ్లాడువారు. క్రొత్తపెండ్లాముతో కులుకుతూ [illegible], మోహసముద్రములో మునిగి తేలుచున్న భాస్కరునకు కమల కష్టసుఖములనైన నరయుటకు తలంపు గలుగలేదు. స్వార్థపరులగు పురుషుల స్వాభావికమే యిట్టిది.

## పశ్చాత్తాపము

ఆరువత్సరములు గడచినవి. భాస్కరుని రెండవ భార్య కొమార్తెగని పురుటాలిజబ్బువలన నకాల మృత్యువువాతబడెను. భాస్కరునకు నల్దిక్కులా అంధకారమావరించినది. కాళ్లకు సంకెళ్లవలె శిశు పోషణాభారమాతనిపై బడినది. కారణము లేకనే కలహించి ప్రథమభార్యను పరిత్యజించిన ఘట్టమాతని కండ్లయెదుట గట్టినట్లయ్యెను. భార్యను పరిత్యజించుటవలన పరితాపము, మరణించినభార్యకై దుఃఖము, శిశువుపైగలిగిన యభిమాన మొక్కుమ్మడి హృదయమును కలతపెట్ట నాత డున్మత్తునివలె సంచరింప దొడగెను.

* * * *

కమల భర్త యింటనుండి వెడలిన తరువాత కొన్నాళ్లకు ప్రభుత్వపాఠశాలలో నుపాధ్యాయినిగా ప్రవేశించెను. ఆమె తెలివితేటలకును, బోధనాక్రమమునకును ఉన్నతోద్యోగులు సంతసించి ప్రోత్సహించిరి. ఆప్రోత్సాహమువలన నామె కార్యదీక్ష ద్విగుణీకృతమయినది.

నాడు శెలవుదినమగుటచే కమల ఇంటకూర్చొని విద్యార్థినీ వ్యాసరచనలను పరిష్కరించుచుండెను. భాస్కరుడు వికృతరూపముతో ద్వారముదరినుండి “కమలా! కమలా!”యని పిలచుచు లోనికివచ్చి నేరస్తునివలె తలవాల్చి ఆమెమ్రోల నిలచెను. కమల నివ్వెరపడిలేచి, రెండడుగులు వెనుకకువైచి, పొంగి పొరలివచ్చు దుఃఖ మశ్రురూపముగ వెల్లువలై ప్రవహింప “నేటికైనను నే సజీవురాలనైయున్నానని తమకు స్ఫురించుట నాయదృష్ట”మని గద్గదిక స్వరమున పలికెను.

“కమలా! నిన్నాడినమాటలకు, నీకొనర్చిన అపచారమునకు తగిన ప్రాయశ్చిత్తమును బడసితిని. నీయెడ నేనొనర్చినపాపమే నన్ను కట్టికుడిపినది; కుడుపనున్నది. దానికి పరిహారమేలేదు. క్షమార్పణ కోరుకొనుటకైన నవర్హుడనగు నేను నా అంత్యకోర్కెనెరవేర్పబడునన్న విశ్వాసముతో వచ్చితిని. కమలా! నాజీవితము నిరర్థకము. నాకింక మరణమే శరణ్యము. నాశిశువునెట్లయిన పోషించుబాధ్యత నీవు గైకొన్నచో నిశ్చింతగా నసువుల వీడుదును.”

“మీ పునస్సందర్శనము లభించుటచే నేడు సుదినము. మీకు పశ్చాత్తాపము గలుగుటయే నాభాగ్యము. మరల నాకు భర్తృసేవ లభించుటయే నాయదృష్టము. నాకంతమున జీవము లున్నంతవరకు మీరు నిష్పృహ చెంద నక్కరలే”దని భర్తతో కమల అత్తవారింటికి బయలుదేరినది.

## బాబూ బ్రదికితిమి!

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మగారు

సీ. ఏబ్యాచిసనుగునో యెవరినో యనుభీతిఁ, గోలుపు క్రిటిసిజముల్ తొలఁగిపోయె,
వ్రాసినదానినే, రామకోటిగ వ్రాయు నాబ్జరువేమనుఁ లంతరించెఁ,
బాడినపాటనే, పాడించునీనోట్సు ఆపు లెసన్సుల హంగులుడిగెఁ,
దలఁపనితలఁపుగాఁ దగిలెడు టీచింగువర్కు బాధలుకూడఁ బ్రాతవడియె,
గీ. వేళపాళలులేని డ్రిల్ వెనుకఁబడియె, గడిచెడాక్టరు సర్టిఫికెట్ల బాధ
బ్రతికితిమిజీవుడా శాంతపడఁగదోయి, గడచిపోయెను ట్రెయినింగు గండమహహ.
మ. తలుపుల్ ద్వారములున్ బిగించి గదులన్ దట్టించి యేపచ్చికా
యలనో కావున గట్టిపక్వమునకై యత్నించు ట్రైనింగహో
బలవంతంబగు బ్రహ్మచర్యవ్రతసంభారంబు లీయూడుబి
డ్డల యార్భాటము లత్తదెప్పలును జూడంబోము మున్ముందికన్.
సీ. దొరగారితో మాట జరుగురుకై చేయు ముసాబులమజూడఁ బోముముందుఁ
బూర్తిగా స్టైఫండు ముట్టునో ముట్టదో యనుతొట్రుపాటుల నరయమింక
టీచింగువర్కు క్రిటిసిజములెగవేయు సూక్ష్మపద్ధతులను జూడమింక
వేళకునేదియో వి స్తరిలో వేయు, వరదప్రసాదంబుఁ బడయమింక,
గీ. శాంతిబొంది ప్రయాణముల్ సలుమానె, సెలవుకయిపితృదేవతా కులమునకును
జిత్రలేఖనదీక్షయుఁ జెల్లెఁగానఁ, బ్రతుకుజీవుఁడ తీఱె నవస్థలెల్ల.
చ. ఎలుకను దెచ్చి పిల్లియిది యానసుమర్క విధి మూడు కాళ్లపి
ల్లులసృజియించెనన్నఁ దలలుంగదలించుటదీఱె మామనం
బులకుయధేచ్ఛగల్గెఁ బతి పుస్తకమొక్కొక్క దేవుఁడన్న రో
జులుగతియించె నింకఁబరిశుభ్రవునో గిరమబ్బుజీవుడా.
సీ. క్రొత్తపుస్తకము పేరును జెప్పినంత సంపాదింపనెంచు తాపత్రయములు
ప్రాజక్టుడాల్ టను మున్నగునేవియో, మేనుదట్టించెడు మెలకువలును,
నేహిరణ్యాత్మున కెఱుకలేనివరంబు లడుగునుద్యోగ ప్రయత్నములును,
నర్థమెఱుంగని యన్నినోట్సును నొంటికెక్కించు వేదబట్టీయములును
గీ. జిత్రి యులియును అంపంబుఁ జేతఁబట్టి, చెక్కుచున్నట్టునటియించు చేష్టితములు
నిన్నియునుఁగూడ నేటితో సున్నయయ్యె, జీవుడాభీతిలేదింక శ్రేయమొదవు.
చ. పడితిమిసౌఖ్యముల్ గురుల భవ్యకృపామహిమంబు చేనహో
గడిచితిమన్నియుర్కముదము గల్గెను టీచరువృత్తియందు మే
మడుగిడనేగుచున్నను నిరంతరముక్ మిముఁగొల్చియిచ్చటక్
గడిపినరోజులెల్లఁ జిరకాలము మాహృదినిల్చుపోయిగా.

# దసరా కుడుము (,వు,) లు

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

వ్యాకరణ దీపాగ్రహారములో ఈసారి దసరా మహోత్సవము చాల వైభవముగ జరిపించువిషయమై అచ్చుల పాటివారు హల్లులపాటివారు ఉభయాలవారు కలిసి గట్టి ప్రయత్నముచేయ మొదలిడిరి. క్రియల ధాతయ్య మనుమరాలి మగడొకడు కాశికి వెళ్లి వ్యాకరణశాస్త్రమునందును శబ్ద శాస్త్రమునందును గొప్ప పాండిత్యము సంపాదించుకొని వచ్చినాడు అప్పటి నుండియు తన మాతృభాషయైన ఆంధ్రభాష యందభిమానము గలిగి దాన్ని గూర్చి పరిశోధనచేయ మొదలిడినాడు. అగ్రహారీకులు అతనిని కాశీపండితుడనియే వ్యవహరింతురు. అగ్రహారములోని సహపాఠకులు కొందరు ఆంధ్రవ్యాకరణము అభిమాన విషయముగా నభ్యసించినందున దసరా మహోత్సవ కార్యక్రమములో కాశీ పండితుని ఉపన్యాసము ఒకటి 'ఆంధ్రులు తెలుగువారు'అను విషయముపై నిప్పింప నేర్పాటుజరిగెను. పండితుని యుపన్యాసమునకు ముందు అగ్రహారమునందు దసరా సమయమున కొన్ని ఆకర్షణీయములగు ప్రదర్శనములు జరిగినవి.

వ్యాకరణ దీపాగ్రహారీకులకు రానురాను ఆత్మరక్షణకుగాను కొంతమంది బాలభటులను యుద్ధప్రియులుగా తయారుచేయ వలసిన యవసరమేర్పడినది. అందుచేత కొంతమంది బ్రాహ్మణవిద్యార్థులు క్షత్రియ బాలురవలె ధైర్యసాహసౌదార్యాది సుగుణములనేగాక శారీరకముగా అంగసౌష్టవము గూడ పెంపుచేసికొనిరి. అయితే యిన్ని యుండియు వారికొక్కరీతిదుస్తులు లేకున్నదియు నొకగొప్ప కొరత యేర్పడును. గావున వారికందరకు వారి నాయకుడొక విధమై విలక్షణమైన దుస్తులు కుట్టించి తొడిగించి వారిని తృప్తిపరచి తాను తృప్తి పడినాడు. కాని వారు ధరించు టోపీల విషయమై ఒక్కతీరైన వస్త్రధారణము జరుపుటకు వీలులేక పోయినది. కాబట్టి వారి నాయకుడు వారి నందరిని రెండు తెగలగా భాగించి మొదటివారిని తెలుగు జోదులని పిలిచినాడు. రెండవ తెగవారికి సాంస్కృతులని పేరిడినాడు. తెలుగుజోదులందరు 'థేట్ తెలంగానా' గడ్డకు జెందిన వారనియు సాంస్కృతికులందరు ఉత్తర దేశమునుండివచ్చి దక్కను పీఠభూమిపై నున్న తెలుగువారితో గలసిపోయినారనియు, వారిముఖములు, తలపుత్రెలు, దంతములు, దవడలు, మొదలైన అవయవ పరీక్ష కొంత యొనరించి నిర్ణయించినందున

ఇప్పుడా రెండువర్గములవారికి నేర్పాటు చేసిన శిరోవేష్టధారణ విధానములో భేద మేర్పడినది. అది యీరీతిగానున్నది.

తెలుగుజోదులకందరికి అసలు టోపీలే అక్కరలేదన్నాడు. కాబట్టి టోపీ లేని తెలుగుజోదులందరు ఒక రెజిమెంటులో జేరవలసినవారైనారు. ఇక సాంస్కృతికులకు నైనను నొక్కవిధమైన టోపీల యేర్పాటు చేయ వారి నాయకునకు సాధ్యమనిపింప లేదు. కావున వీరికి మూడువిధములైన టోపీల నేర్పాటుచేసినాడు. కొన్ని 'డు' టోపీలన్నారు. మరికొన్నిటిని 'ము' టోపీ లన్నాడు. ఇంక కొన్నిటిని 'వు' టోపీ లన్నాడు. ఈ మూడువిధములైన టోపీలను నెవ రేవి ధరింపవలసియున్నదను విషయ ములో గొన్ని నిబంధనల నేర్పాటుచేసి నాడు.

తెలుగుజోదులనందరిని యిప్పటి పరి భాషలో వలయశిరస్కులని చెప్పబడిరి. అనగా గుండ్రనితలలు కలవారన్నమాట. వారిజుట్టు కత్తిరింపు విధానము వారికీపేరు కల్పింపచేసినది. వారికేమియు టోపీలు లేకపోయినను జుట్టుకత్తిరింపులో నొక్క రీతి పక్కి యేర్పడినది కాబట్టి ఆ రెజిమెంటు యూనిఫారమునకు నేమియు గొరతరాలేదు.

సాంస్కృతికులలో 'డు' టోపీలు ధరించు వారందరు తలకట్టు కలవారుగా నుండ వలెను. కాని గుడివంటి జుట్టుముడికల వారుగా నుండకూడదు. పుంల్లింగసంజ్ఞకల వారుగా మాత్రముండవలెను. ఈ టోపీలు ధరింపజేయునపుడు తలకట్టులకు తోడొకింత కొమ్ముంచవలసిన అవసరముకలిగినది. 'ము' టోపీలు ధరించువారందరు గుడివంటిజుట్టు ముడికలవారుగా మాత్రముండరాదు. కాని నపుంసకలింగ సంజ్ఞకలవారుగానుండవలెను. 'వు' టోపీలు ధరించువారందరు కొమ్ములు దిరిగినవారై యుండవలెను. కావున వీరికి పుంలింగసంజ్ఞ యుండవలసివచ్చినది. గుడి వంటి జుట్టుముడికల వారందరికి 'డు' టోపీలు తొడిగించి తరువాత నవి తీసివేయవలసిన యవసరము కలిగినది గావున వారి నెల్లైన ప్రత్యేకవర్గములో జేర్పవలసివచ్చి తెలుగు జోదులవలె సాంస్కృతికులలోని వీరుకూడ టోపీలేని రిజిమెంటులోనే జేర్పబడవలసిన వారైనారు.

సాంస్కృతికులలో కొందరు స్త్రీ బాల భటులుకూడ చేరుట తటస్థపడినందున వారి దీర్ఘాంతములైన శిరోజములను గురుచ లగా జేసివైచి ముంగురులూ గిరజాలు కల వారలుగ జుత్తుకత్తిరింపు చేసికొనవలసిన వారైనారు. ఈ రీతిగ సాంస్కృతికులలో అనుకొన్న మూడు రెజిమెంట్లకంటె లెక్క కెక్కువకలవారు కావలసివచ్చినారు.

ఇటువంటి ప్రదర్శనము లెన్నియో నాటి దసరామహోత్సవములో జరిగినవట.

ఈ వ్యాసారంభమున మొదలు తెలిపిన కాశీపండితుని ఉపన్యాసమునకు జనులు క్రిక్కిరిసిపోయిరి. నాటి యుపన్యాససభకు

వెడలిన ఒక వ్యాకరణ పండితునకు వెడలని మఠాశనికి జరిగిన యీాక్రింది సంభాషణను బట్టి ఉపన్యాసమందలి విశేషాంశ సారాంశములు పాఠకులు తెలిసికొనవచ్చును. పై యిద్దఱి పండితులలో నొకరు దేవణభట్లు, నింకొకరు భట్టోపాధ్యాయులు.

దేవణభట్లు—మొత్తంమీద వుపన్యాసకులు చెప్పినదాని సారాంశము ఆంధ్రులు తెనుగువారు ఆరంభంలో ఒక్క తెగవారు కారని తేలింది.

ఈశ్వరభట్టు — అట్లయితే తెలుగువారి నివాసస్థానము యెక్కడదై వుంటుందని ఉపన్యాసకు లభిప్రాయపడుతున్నారు?

దేవణభట్లు—ఆదిని యెక్కడ నివసించెడివారో యెవరు నిర్ధారణచేయలేదట. కాని తెలుగువారికి తెలంగాణమే నివాసస్థలమని—

ఈశ్వరభట్టు—ఆంధ్రులకో?

దేవరభట్లు— ఆంధ్రులకు అమరావతి ముఖ్యపట్టణంగా యేలిన శాతవాహన రాజ్యభాగము ముఖ్యముగా ఇప్పటి కృష్ణ గోదావరీ గుంటూరుమండలములలో నున్న దేశం నివాసభూమై వుంటుందట, కాని—

ఈశ్వరభట్టు—కానేమిటి? నన్నయభట్టు భారతంలోనే ఆంధ్ర తెలుగుశబ్దాలు ఒకదానికొకటి పర్యాయపదాలుగా యున్నాయంటే దానికేం కారణమైవుంటుందంటారు?

దేవణభట్లు—నన్ను పూర్తిగా చెప్పనీయండి — కాని ఆంధ్రులు తెనుగు (తెలుగు) దేశముకూడ ఆక్రమించుకొని తెలుగువారితో కలసిపోయినపుడు ఆంధ్రుల సంస్కృత ప్రాకృతభాషలు ద్రావిడభాషా కుటుంబానికిచెందిన తెలుగుభాషతో సంక్రమించినవట. ఆంధ్రభాషలో ఆదిగ్రంథమనుకొనే భారతము నాటికి ఈ రెండుభాషలు అభేదభావాన్ని పొందినవట.

ఈశ్వరభట్టు—మనంకూడ ఆంధ్ర వ్యాకరణముతో తృప్తిపడిఉండక సంస్కృత వ్యాకరణంలోకూడ కృషిచేస్తే మన కాశీ పండితుల వారివలెనే పండిత పరిషత్తుల్లో బిరుదులు సంపాదించుకోవచ్చును.

దేవణభట్లు—అంతకన్నానా! ప్రొద్దు పోయినది. పోదాం పదండి.

# "సదుపదేశములు"

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ప్రపంచపరిస్థితులు మన తాతలనాటికంటె మారాయి. ఎక్కడనో గ్రామాదులందు కలరేమో కాని, యీరైళ్లు, మోటార్లు, సైకిల్సు, జట్కాలు వగైరా, ప్రయాణసాధనాలు వచ్చినప్పటినుండి నాగరికత, విద్యాగంధము (కొద్దో, గొప్పో) తెలివి తేటలు ముప్పాతికజనానికి అబ్బినవి. వెర్రిచూపులు చూచు ఆశ్చర్యములు స్త్రీలను వదిలాయి. అన్ని తెలిసిన ముదిమాటలు, బాల్యమువనే కలిగాయి. ఇన్ని విధాల తెలిసికొని చూస్తూ, అనుభవిస్తూకూడ, కంగార్లు, పొరబాట్లు కొందరికి వదలలేదు. దానవచ్చే అపాయములు చూస్తూకూడ సమయానికి బుద్ధి మందగిస్తుంది. దీనికే "బుద్ధిః కర్మానుసారిణీ" అంటారు. చివరికి వేదాంతము. అందుచే మొదటనే కొంచెము జాగ్రత్తపడిన మంచిదేమో?

## రైలు ప్రయాణము:—

నూటికి తొంబదిమంది చేయుచునే యున్నారు. కర్మముచాలకతప్ప తెలివితక్కువచే రైలు దిగిందనుకొండి. లోపల తనవాలూకు జనానాయో, లేక స్నేహితులో వున్నారనితలచండి. ఇవతల వీనికి లోపల వారికికూడా అంత కంగారెందుకు? తనుండిపోతాడా తరువాతిస్టేషనులో ఎక్కినవారు దిగి వీనికొఱకై వేచి యుండవచ్చును. లేదా? గొలుసులాగి తగినకారణము తెల్పవచ్చును. లేదా, తరువాతి రైలులో దిగబడిన మనిషి రావచ్చును. అలాచేయరే కొందరు. ఎజమాని యెక్కలేదు, టిక్కెట్లు ఆయనవద్దయున్నవి, మేమెట్లాగని అనుకోడము కంగారుతో ఉరికేయడం, లేదా రైలుతో పరుగెత్తి ఏపెట్టెలోనో ఎక్కబోయి రైలు వేగము కాగలేక దానిక్రిందపడుటో, చచ్చుటో. ఇట్టి సంభవము లెన్నియేని జరుగుచున్నవని వార్తాపత్రికలు ఘోషించుచున్నవి. ఇట్టివి నిత్యమువిన్నా, కన్నా కూడ తెలిసికోరు. అంతలో తొందరపడక కొంచెము నిదానించినయెడల, ప్లాటుఫారమువారికి బండిలోవారికికూడా సురక్షితమేకదా? అందులకే దానములలో నిదానము శ్రేష్ఠమన్నారు పెద్దలు. మన దార్ల భాగుపడుటకే పెద్దలు సామెతల రూపముగా స్వానుభవములు గ్రంథస్థమొనరించి సదుపదేశము లిచ్చియున్నారు కాని అన్నీ తెలిసిన నాగరికుల మనుకొను మనవారు వేదవి చేతకాని వ్రాతలని తృణీకరించి చేచేతలపని తెచ్చుకొనుచున్నారు. "అతి పరిచయా దవజ్ఞత" యని అస్తమానం రైలు మోటార్లు ఎక్కుతూవుంటే, "జాగ్రతా భయంనాస్తి" అనుమాత్రం మరచి, నేనేమి చేతకానివాడనా యన్న తలబిరుసు తనము ఎక్కువై, బూట్సుకాళ్లతో గబగబా గర్వంగా ఎక్కబోయి ఏ పండుతోలుమీదనో కాలేసి జారి రైలుక్రిందబడి చచ్చినవాళ్లును అవయవ విహీనులై ఆమరణాంతము నిరుపయోగజీవితము గడుపుచున్నవారును అనేకులు గలరు. రైలుపట్టా లమ్మటేవస్తూ, మీదకివచ్చేరైలును గమనించక ఆమధ్య యిద్దరు రైలుక్రిందబడి తునకలుతునకలైనారని వార్తావిదితము. రైలంతదూరాన వస్తూండగనే ఇంతలో పట్టాలు దాటుదామనుకొని వెళ్లబోవుట, దానిక్రిందబడుట భయంకర మృత్యుగహ్వరమున బడుట దృశ్యములగుచున్నవే. అందుచే తెలియదగిన అంశమేమనగా, కంగారుపడక నిదానించి నడచుకొనిన దైవికములు గాక స్వయంకృతాపరాధాపాయములు కొంతవరకు తొలగగలవు.

## అగ్నిభయములు:—

నిప్పులవద్దకుపసిబిడ్డలను పోనియ్యరాదు. అశ్రద్ధగా కుంపట్లమీదనుండి కాఫీలు, పాలు, కట్టువస్త్రములచే దింపుట చాలామంది స్త్రీల కలవాటు. అట్టి యలవాటుకు

గురిస్త్రైలంగారుబొమ్మలు భస్మమైనవి చూచితిమి. శీతకాలమున పిల్లలు చలిమంటలు వేసికొని చుట్టుమూగి బట్టలుకప్పుకొని కూర్చుండుట కూడనిపని. పెద్దలట్టివి బాల్యమాది శిక్షించి బోధించి మాన్పించవలయును. లేనిచో తెలియని అమాయిక బిడ్డలఆపదలకు పెద్దలే కారణమగుదురు. ఒకవేళ కర్మముచాలక బట్టఅంటు కుంటేకంగారే హానికలుగజేయును. అంటుకొనినవారు పెద్దవారైతే క్రిందబడి దొర్లుటయో, చిన్నలైతే పెద్దవారు వారిని దొర్లించుటో, లేక ఇంతేమున్న అంటుకొనుచున్నబట్టపై కొట్టుటో శ్రేష్టమైనపని. కంగారుపడితే యుపాయము తోచదు. అపాయము తప్పదు. నిప్పు నీళ్లుకూడా కంగారుమనుజులకు ముప్పే తెచ్చును. ఈతచేతనగునన్న అహంభావుడు తనశక్తి తెలియక నీటిమధ్యకు పోవును. అంతటిలో శక్తి సన్నగిల తిరిగి రాలేక అలసి భయపడి కంగారుచే అడుగంటును. రాకపోకలశక్తి నూహించుకొని యీదుట నిదానము. నిరపాయము. మితితప్పితే మతే పోవును. మితిమీరినఅలవాట్లు, ఆహార,నిద్రావ్యవహారములచే తల వేడెక్కి మతితప్పుట కేమాశ్చర్యము?

చంటిపిల్లలకు "బాలపాపచిన్నె" యను జబ్బు అతిశీతవాతముచే జ్వరమువచ్చి విరేచనబద్ధము కలిగినప్పుడు వచ్చును. ఈసంగతి తెలిసినవారు అట్టిపరిస్థితి రాకుండనే మొదటనే జీర్ణకోశమునకు విశ్రాంతియిచ్చి కాలవిరేచనమగు నేర్పాట్లుచేయుదురు. ఒకవేళ అట్టి జబ్బు వచ్చినదనుకొండి. నిదానించి ఏనీరుల్లిపాయరసమో, ముక్కలో, పిండియో స్మెల్లింగుసాల్టు పీల్పించియో, ఎగురవేసి పట్టుకొనియో చికిత్సలు చేసికొందురు. అయితే అజబ్బు వచ్చినవారిని యుపేక్షించక వైద్యచికిత్సలు వెంటనే చేయాలికాని, గొల్లుమని పదిమంది గోశత్తి చికిత్సలుమానేసి బిడ్డని యొడియందుంచుకొని ఏడ్పు మొదలిడ చుట్టుప్రక్కవాళ్లు మూగి, త్వరపడి నిప్పుచేకాల్చుట మనలో మూడువంతులు జరుగుచున్నది. భయమెక్కువ, నిదానముతక్కువ, కంగారెక్కువ. ఇట్టివాటిలోనే నిజంగా ప్రాణాపాయము కలుగును. అందుచే హడావుడిచేయక క్రియమాత్రం వెంటనే జరుపుకొని బిడ్డల బ్రతికించుకొనవలెనని డాక్టర్లు మొరబెట్టుచున్నారు. స్త్రీలకీ హెచ్చరిక యత్యంతావశ్యకము. సంతానము స్త్రీయధీనమగుటచే తల్లికి ఈముఖ్యోపదేశములు.

బిడ్డడేదేని యపాయస్థలమం దున్నసంగతి గమనించినవారు కేకలు బొబ్బలు పెట్టితే ఆబిడ్డకంగారుపడి అపాయములోనే కూలును. అందుచే మాట్లాడకుండా నిదానముగావెళ్లి వానిని గమ్మున తీయవలెను. పసిపిల్లలనేక మురికిస్థలములలో చేతులుంచి ఆడుదురు. వారు పాపము మంచిచెడుగు ఎరుగని కనుగండులగుటచే ఆచేతులతోనే తినుపదార్థమేదైనను ఎవరుపెట్టినను తిందురు. కాన బాధ్యులు వారికివి మొదటినుండియు శుచిత్వము నేర్పవలెను. నేర్చినబిడ్డడట్టి యలవాటుపడి కాలుసేతులు కడుగుకొననిదే ఏదియు తినడు. బిడ్డలను దరిద్రకొట్టులక్రింద ప్రతివాళ్లను అడిగేగుణము కలుగకుండా తగినబోధ తలిదండ్రులు చేయుచుండవలెను. పిల్లలభవిష్యత్తు తల్లుల హస్తగతమని గుర్తెరుగవలెను. మృదువినయ సంభాషణల కలవాటుపడునటుల బిడ్డలయెదుట పెద్దలు వర్తించవలయును. 'ఏగూటిచిలుక కాపలు'కని ఆర్యవచనము. ముఖ్యముగా అసత్యము, దొంగతనము, కలుగకుండ బాల్యమునుండియే పిల్లలను కట్టుదిట్టపరచవలెను. కొమ్మైవంగనిదే మ్రానై వంగదను సామెత నందరెరిగినదే.

ఒకరింటికివెళ్లే ఆడపిల్లను వినయవిధేయ సద్గుణశీల సత్యప్రవర్తన గలదానినిగాను, ఆయాపరిస్థితులందు తగినయోర్పుకలిగి శాంతశమదమాది భక్తియుతురాలుగాను తయారుచేయుటకు జాతీయ విద్యావిధానమవసరము. అట్టి సద్విద్యనెప్పించి ఇరుకులములకు కీర్తితెచ్చునటుల తలిదండ్రులు జాగ్రత్తదీసికొనవలయును. పసినిసుగునుంచి విసుగుచే బూచిభయము పెట్టరాదు. ఆజన్మ పిరికివారగుటకీ యాదిభయమే కారణమైయున్నది. ఇది క్రొత్తదేమియు గావు. ఆచరణలో బద్ధకములుగాని వింతలుగావు.

## బిడ్డలు—ఆరోగ్యము.

బిడ్డల ఆరోగ్యము అందరు గమనింప దగినది. బిడ్డలన ఐదు మొదలుకొని 12 సంవత్సరముల వయస్సు గలవారు. కళాశాల విద్యార్థుల విషయములో చూపునంతటి శ్రద్ధ చిన్నవయస్సులో చూపనందున మనము శ్రద్ధ దీసుకొను కాలమునకు రోగములు ముదిరియుండి అపాయమును దెచ్చును గాన బాల్యమునందే వారి ఆరోగ్యమును గురించి శ్రద్ధ దీసికొనుట ముఖ్యము.

ఆరోగ్యముగ నుండుబిడ్డలకు కాంతిగల వెండ్రుకలు, ప్రకాశమైన కనులు, ధారాళమగు శ్వాస, బలమై శుభ్రముగనున్న దంతములు, రూపుగొనిన కండరములు, విశాలమైన రొమ్ము, చక్కగ బెరిగిన కాళ్లు చేతులు, వంగిన పాదములు, ఆకృతికి సరియగు బరువు మనో భావములు ఉండును.

బాలు రిట్లుండక పోవుటకు వారి స్వగృహము, చదువు పాఠశాల, వాని పరిస్థితులు, పరిసరములు కారణములు. తలిదండ్రుల దుర్నడతలు, అనాదరణ, ఆహారనియమములేమి, దారిద్ర్యము, అశుచి, అనారోగ్యమునకు కారణములు. పాఠశాలయందు విశ్రాంతిలేమి, గాలివెలుతురు లేనిచోట చాల కాలముండుట, ఆట పాటలకు వసతి లేకుండుట కారణములు. తలిదండ్రులు పై జెప్పిన విషయము లన్నిటను శ్రద్ధ వహించుటయేగాక పాఠశాలలో బాలురను వైద్యులు పరీక్షించి సూచించురీతి చికిత్స చేయింపవలయును. బాలుర అనారోగ్యము బాపుటకు ప్రాథమిక పాఠశాలలందలి వైద్య పరీక్షలెంతయు సహాయకారులు.

సాధారణముగ బిడ్డలకు కలుగుచుండు రోగములివి:—

కీళ్లనొప్పులు:—సకాలమున నియమితమైన ఆహారము నివ్వనిచో నివి గల్గును.

పండ్లవ్యాధులు:—బిడ్డలకు పాచి, పులుగు (పిప్పి)పండ్లు సాధారణము. వీని నూడదీయనిచో నితర రోగములను గలిగించును.

కనులజబ్బులు:—అపుడపుడు కన్నులలో లేచుచుండుపుండ్లకు సరియయిన వైద్యము చేయించనిచో దృష్టిమందమగును.

పై జెప్పినవిగాక మలబద్ధము, అజీర్ణము, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, బిడ్డలకు అపుడపుడు కలుగుచుండు జబ్బులు. వీనిలో మలబద్ధము ఆహారమునందు నియమము లేకున్నను, వలసినంత వ్యాయామము లేకున్నను కలుగుచున్నది. దీనివిషయమై యెక్కువ శ్రద్ధదీసి కొనుటావశ్యకము. కొందరు పిల్లలు జీర్ణకోశములో క్రిములచే బాధపడుదురు. అపక్వాహారమును తినుట, అశుచియగు చోటులందు నివసించుట, మలమూత్రములు విసర్జించు చోటులందాడుకొనుట దీనికి కారణములు. అశుచియే దురద, గజ్జి, కామిల మొదలగు చర్మవ్యాధుల కలిగించును. ప్రాథమిక పాఠశాలలందు జదువు బాల బాలికలను పరీక్షించి వైద్యులిచ్చు సలహాలతో నేకీభవించి తలిదండ్రులు తదుచితముగ వర్తించుట సమంజసము.

# పాకకళ

## గోధుమపాల చంద్రకాంతలు

అరశేరు గోధుమలు తెచ్చి నీళ్లలో నానబోయవలెను. ఒక పావుశేరు పెసరపిండి నేతితో కలిపి గట్టిగ చేసికొని యొక రాత్రంతా యుంచి తదుపరి గోధుమలు రోటిలో వేసి మెత్తగారుబ్బి సన్నని శుభ్రమైన గుడ్డలో వేసి వడియకట్టినచో చిక్కనిపాలు వచ్చును. నేతితో కలిపి యుంచుకొనిన పెసరపిండి బాణలిలో వేసి దోరపడునుగా వేచి దించుకొనవలెను. గోధుమపాలను ప్రాయిమీద బెట్టి సలసల మరుగనిచ్చి వేచిన పెసరపిండి యాలకులు బాదాం కిస్మిసు పావుశేరుచక్కెర వేసి కలియ త్రిప్పుచుండిన కొంతసేపటికది గట్టిపడును. తదుపరి ముక్కలుగ గోసికొని బాణలిలో పావుసేరు నెయ్యిపోసి పొయ్యిమీద బెట్టి నాలుగేసి ముక్కల చొప్పున ఎరుపు డాలుగా వేయించి భుజించిన చాలా రుచిగానుండును.

—పోతుల జయలక్ష్మి.

## బరిఫీ

మంచి గోధుములను దెచ్చి యొక యరవీసె పిండిగా జేసికొనవలయును. తరువాత అరవీసె పంచదార, అరవీశ నెయ్యి, తులము యేలకులపొడి సిద్ధముగ నుంచుకొనవలెను. నెయ్యిని ఇత్తడిపాత్రలో గాని, కళాయివేసిన పాత్రలో గాని బోసి, బాగుగా మరుగుచున్న సమయమున అరవీసె గోధుమపిండిని దానిలో వేసి కలిపి కొంచెము యెరుపురంగు వచ్చిన మీదట పంచదారను, యేలకులపొడిని వేసి కలియ బెట్టవలెను. కొంతసేపటికి పుడుసుట ప్రారంభించును. బాగుగా పుడికినతరువాత పాత్రను దింపి ఒక బల్లకు నేయి వ్రాసి, పాత్రలోనిది దానిపైవేసి బిళ్లలుకోసి ఉపయోగించుకొనవలయును. నోటిలో వేసికొనిన కరగిపోవును. మిక్కిలి రుచిగానుండును.

—లలితకుమారి.

## ఆరోగ్య హల్వా

అరపడి నల్లబియ్యపుపిండి, ముదిరిన టెంకాయపాలు అరపడి, గోధుమరవలు తడిపిపెట్టి పిండినపాలు అరపడి, ఆవుపాలు కాలుపడి వీనియన్నిటిని యొకటిగా కలిపి ఒకపాత్రలో వేసి పొయిమీద బెట్టి విడువక కలియబెట్టుచుండి, నీళ్లన్నియు యింకి గట్టిపడునప్పుడు ఇరువదిరెండు పలముల తెల్లచక్కెరను పాకముచేసి యుంచుకొని ఆ పాకమును కొంచెము కొంచెముగా అందులోబోసి కలియబెట్టుచుండవలయును. అప్పుడు ఎనిమిది పలముల నెయ్యిని కొంచెము కొంచెముగా వేసి కలియబెట్టవలయును. తరువాత ఏలకులు, జాజికాయ, జాపత్రి, కుంకుమపూవు, యివి నాలుగు సమభాగములుగా చేర్చిన పొడి అరపలము అందులో వేసి కలియబెట్టి చేతికి అంటని సమయమున నొక తట్టలో నెయ్యినిపోసి అందులో ఈ హల్వాను చేర్చి రెండంగుళముల మందముగాబోసి, ఆరినమీదట కత్తితో బిళ్లలుగాకోసి భుజించినయెడల చాల ఆరోగ్యముగానుండును.

—పి. కమలావతి.





# వరదల ప్రాంతమందలి వారలకుచితమైన తేయాకు

ఇండియను తేయాకు సెస్ సంఘమువారిట్లు ప్రకటించుచున్నారు:—

ఉత్తరఈశాన్య భారతదేశ వరదలో సంయుక్త రాష్ట్రమున కొన్ని జిల్లాల ప్రజలు అపరిమితముగ వెతల పాలగుచున్నారు. గోరఖ్పూరు మున్నగు కొన్ని చోట్ల వేనవేల ప్రజలు వరదల ప్రదేశమునుండి తల దాచుకొనుటకు వచ్చిపడుచున్నారు. పరిస్థితులనుబట్టి ప్రభుత్వమువారు వీరందరకును సహాయము చేయవలసి యున్నది. ఈ వరదలుగలజిల్లాలందు తేయాకు సెస్ సంఘమువారు శిబిరముల నేర్పరచుకొని గొప్పప్రచారమును సల్పుచున్నారు. వరదలచే ఇక్కట్లుపడుచున్న ప్రజలకు ఎంతయో తోడ్పడుచున్నారు. తేయాకు సెస్ పనివాండ్రు వరదలచే బాధపడువారికి ఇచ్చుటకు ఆహారముగాని దుస్తులుగాని లేకపోవచ్చును. సమృద్ధిగ తేయాకుగలదు. పాపమీ ప్రజలకు హాయిగా త్రాగుటకు వేడి తేనీరు నిచ్చెదరు. వారికిది ఉత్సాహమును కలుగ జేయును, ఈ తేయాకు ప్రచారకులు తలదాచుకొను ఈ ప్రజలకే ప్రతిదినము వేలకొలది గిన్నెల తేయాకును పోయుచున్నారు. వీరికి దగ్గరదగ్గరగానే వీరు మసలుచున్నారు. ఈ సంఘమువారు దురదృష్టవంతులగు ఈ ప్రజలకు వర్షబాధ లేకుండ పాకలను వేసి కాపాడి తేయాకును పోయుచు వారు ప్రచారమును దివ్యముగ సాగించుచున్నారని సంఘముతాలూకు సూపరింటెండెంటు సంవారమునుండి అలహాబాదుకు తిరిగివచ్చి తెలియచేసెను. చాలమంది స్త్రీలే ఎక్కువగా తల దాచుకొనుటకు వచ్చుటచే ప్రత్యేకముగ స్త్రీలకు ఏర్పాటులను చేయుచున్నారు. ఆరోగ్యాధికారులు కూడ తేయాకు ప్రచారకసంఘమువారి తోడ్పాటును సహాయమును కొనియాడుచున్నారు ఈ శిబిరములందు ఒక్కరుకూడ రోగపీడితులుగ లేరట. దీనికంతకును కారణము, ఈ ప్రచారకులు సప్లయి చేయుచున్న తేనీరే కారణ మనుచున్నారు.

ఈ కష్టకాలమునకూడ తమకీ తేనీరు సాయపడి సంతోషము నిచ్చుచున్నందులకు వరదలచే బాధపడుచున్న ప్రజలు సంతసించుచున్నారు. వారు తమకష్టముల నోర్చుకొనుటకు ఈ తేనీరెంతయు శక్తిని ఉత్సాహ కలుగచేయుచున్న దనుచున్నారు.

# కిచకిచలు

ఒకలోభి యింట్లో పచారుచేస్తూ తన కుమారుడు కిటికీదగ్గర నిల్చుండగా దగ్గరకు వెళ్లాడు. అప్పుడే కుమారుడు తనవద్దవున్న రొట్టెను కిటికీలో నిలబెట్టాడు. తండ్రి అక్కడనుంచి పోసాగాడు. వెంటనే కుమారుడు రొట్టెదీసి తిన మొదలుబెట్టాడు.

తండ్రి:—(ఆశ్చర్యముతో) నాయనా! నీ చేష్టలు నా కర్థంగాకున్నా వున్నాయి.

కొడుకు:—ఏమీలేదు. ప్రక్క యింట్లో మాంసంకూర చేశారు. వాసనవస్తూ వుంది. కిటికీలోగుండా వచ్చేవాసన రొట్టెలోకి రావాలని కిటికీలో బెట్టాను. తరువాత తిన్నాను.

తండ్రి:—(కోపంతో) వెధవా! రొట్టెచాలక కూరవాసనకూడా కావాలా? జాగ్రత. ఇహమీాద వట్టిరొట్టె తినాలి. లేకపోతే దేహశుద్ధి అవుతుంది.

* *
*

భార్య.—(ఉద్వేగంతో) అవును లెండి. కథలోని పాత్రకులాగ మీగుణగణాల్ని వరసగా చదువుతున్నా.

భర్త:—చదివితే చదివావుకాని మెల్లగా నోటిలోనే చదువుకో.

* *
*

ఒకడు:—ఓరేయ్! మనశంకరం వచ్చే వారం కమలాన్ని పెళ్లిచేసుకుంటాడటరా!

ఇంకొకడు:—శైబాస్!! వాడంటే నాకు మహామంట.

* *
*

తండ్రి:—(కోపంతో) నీ ప్రవర్తన ఏమీ బాగులేదు. ఈలా చేస్తావుంటే పోలీసు వాళ్లని పిలవాలిసొస్తుంది.

కొడుకు:— మంచిది. పిలవండి. మనఇంట్లో లైసెన్సులేని పిస్తోలుందని చెబుతాను.

* *
*

కోర్టులోనికి ఖైదీని దీసికొనివచ్చిరి. దొంగతనము చేసిబ్రతుకుటే ఆతనివృత్తి. అతడు గంభీరముగ నిలుచుండెను. సాక్ష్యము ముగిసినతరువాత,

మేజస్ట్రీటు:—నేరము జేసితివా లేదా?

దోషి:—(నిర్లక్ష్యముగా) నీవే కనుక్కో. నీకు జీతమిచ్చేది దానికే!

* *
*

తన ప్రవర్తన మంచిదని నిరూపించుకోవడానికి దోషి పోలీసు సూపరెండెంటునే సాక్ష్యముగా గోరుకొనెను. మేజస్ట్రీటు ఇతరా ఉద్యోగులు ఆశ్చర్యపడిరి. సూపరెండెంటు బోనులోనికివచ్చి కోపంతో,

"అసలు మనిషే నాకు తెలియదు" అని ఉరిమెను.

వెంటనే జ్యూరీలవంక తిరిగి దోషి నవ్వుతూ, ఇలా అన్నాడు.

"చూచారూ? ఇది నా సత్ప్రవర్తనకు సాక్ష్యము. ఈ చిన్నవూళ్లో ఐదేళ్లనుండీ వుంటున్నాగాని పోలీసువారికి నా సంగతే తెలియదు."

# ఆడలేక మద్దెలమీదపడి కొట్టుకోవడమా?

శ్రీమతి కందాళం కమలమ్మగారు

'ఏమండీ ?'

'.........'

'ఏంపలకరూ?'

'.........'

'కొంచం టీ తీసుకోండి.'

'.........'

'ఇదో చూడండి చల్లారిపోతూంది.'

'.........'

'జేనిలోనో లయింప చేసేరే మనసును.'

'ఊఁష్! అవతలవో.'

'ఈవాళ ఓలాగున్నారే, యెందుకూ?'

'.........'

'ఏమిటా పుస్తకాలు ?'

'వాటితో నీకేంపని?'

'ఏం? నేను చూడకూడదా?'

'మీారెంత కఠినహృదయులు! రాక్షసులు !!'

'ఎవరండీ? ఆడవాళ్లే?'

'ఆ! నమ్మరాదు. పైకెంతో ప్రేమ చూపుతారు; గాని, తేనెపూసిన కత్తులు.'

'ఆలాగా? కారణమేమో!'

'మరేముంది. వారి సహజమయిన కుటిల స్వభావమే.'

'నేడేమో అంతాక్రొత్తధోరణిగావుంది. ఆ గ్రంథాలేమిటి, వేదాంత గ్రంథాలు గాబోలు! చూడనివ్వండి.'

'ఆ! ఆ!! ఆగు!! ఆగు!!! దగ్గరకురాకు. ఎంతసాహసం!!!!'

'ఇంత చీకాకేమిటి ఆ సాహసాలేమిటి కాస్త చెబుదురూ ?'

'చెబితే ఒప్పుకుంటావా ?'

'నిజమైన విషయమయితే-'

'అయితే నేచెప్పేదాంట్లో అబద్ధంకూడ ఉందన్నమాట.'

'ఏమో నాకెట్లు తెలుసు.'

'బడేబడే కవులు వ్రాసిన ప్రబంధాల్లో గూడానా?'

'చిల్లరగావుండవులేండి.'

'అంతా ఆక్షేపించడమే!'

'అంతాకాకుంటే కొంతైనా లేకపోతే ఆకవులు అంతపలుకుబడి కెట్లా వస్తారు?'

'ఇదా నీ పోహణ.'

'ఈ మాటల కేం అసలు విషయం చెబుదురూ.'

'వినుమరి 'పురుషాణామభావేన' అని అన్నాడే...'

'ఆ శ్లోకం చెప్పిందెవరని?'

'ద్రౌపది.'

'అదేపొరబాటు. వ్యాసుడుకదా వ్రాసినది.'

'కాదు ద్రౌపది చెప్పిందే.'

'ఆడదన్నదంటే మరేమాక్షేపణుంది.'

'ఆలాగని వీటిలో వ్రాసివుంది.'

'వ్రాసినంత మాత్రాన అందరికీ అంటగట్టడమా?'

'నీవు ఒప్పుకుంటావా, యింకా పెడవాదమేనా!'

'నేనేమిటి ఎవరూ ఒప్పుకోరు.'

'ఒప్పుకోకతీరదు. భారతం ఒప్పుకోవూ? బలవంతానైనా ఒప్పిస్తా.'

'చేతయితే...'

'ఒప్పుకుంటావా ? లేదా ?'

'దానికి సమాధానం చెప్పమంటారా ?'

'ఏదీ'

'ప్రతికవీ స్వానుభవంవల్లనే పుస్తకాలు వ్రాసి తమ తల్లులకూ చెల్లెళ్లకూ కూతుళ్లకూ ఈలాంటివే నేర్పుతాడు గాబోలు! అలాంటి నీచమైన అనుభవాలవల్ల నీచమనస్సును పొందినవారు అట్లా వ్రాయడం సహజమే.'

'ఒక్కటీ తలకెక్కడం లేదుసుమా !'

'పూర్వకవులు స్త్రీలను అంత నీచంగా చూడడం కులటలని భావించడము, వారికి పెద్ద బానకడుపనీ, పురుషులకంటే ద్విగుణంగా మెక్కుతారని, దయ్యాలపోలికను వర్ణించడం లేనిపోని సాహసాలు కల్పించి వారిని అధఃపతితులని అనిపించడం, శ్లోకాలు పద్యాలు వ్రాసి గేలిచేయడం మామూలే. లేకుంటే ఏ పుత్తమకాంత పురుషుణ్ణి పాడుచేసింది ? చెప్పండి? వారి నవనీతహృదయము పవిత్రత అవ్యాజమైనవారి మాతృప్రేమ దృఢనిశ్చయమూ అప్రమేయమైన ప్రతిభ కష్టకాలమందైనా తమనునమ్మిన పురుషులను విడువకుండా ప్రేమించే త్యాగమూ వారికేమి తెలుసు. పురుషులంతా స్వార్థపరులు. వారికి అక్కరకొద్దీ కక్కుర్తి!'

'ఇంక నీ వుపన్యాసం చాలించు. ఇదా నీ సమాధానం ?'

'చంద్రుణ్ణి చంద్రికలాగు అరణ్యానికి రాముణ్ణి వెంటాడిన సీత, దొంగతనంగా తన్ను కష్టసాగరంలో వదలిపోయినా, భర్తను ప్రేమించడం మరువని దమయంతి, దొంగవలె తన్ను ప్రేమించి తన్ను నగరవాసుల మాటల్తో 'ధంగు' చేసి లోబరచుకొని తానే స్వతంత్రింగాపోతే తెలియనట్లు అభినయించిన దుష్యంతునే నమ్మిన శకుంతలా మొదలయిన వారు ఎంతోమంది వున్నారా? ఇంక మగవాళ్ల...?'

'సారాంశమేమి తేల్చావుమరి?'

'ఆమాట ద్రౌపది చెప్పిందనిఅనుకుందాం. మరి ఆమె సుశీలకాదంటారా ?'

'పరమ పతివ్రత.'

'పతివ్రత యెట్లా అవుతుంది. రేణుక సీటిలో కార్తవీర్యార్జుని ప్రతిబింబం చూడంగానే శీలం భగంఅయిందని,కళంకంవచ్చిందని చాటాడుగదా వ్యాసుడు. ద్రౌపది త్రికరణ శుద్ధిగా చెప్పినపుడు ఆమె సుశీల యెట్లవుతుంది ? మీా నీతిశాస్త్రం

స్మరణం కీర్తనం కేళిః శ్రవణం గుహ్యభాషణం,
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవచ.

అని ఘోషిస్తుందే.'

'అల్లాంటి పతివ్రత యేమన్నా దోషం లేదు.'

'మా బాగుంది మీమాట. పాపం! దోవలో పాద్యే ఆమెకు పాపం రావడమూ బండబూతులువాగే అమెకు పాపం లేక పోవడమునా! ఆ భారతంలో చెప్పిన, అరుంధతి, అనసూయ, సుదర్శనుని భార్య మొదలయినవారు తమశీలాన్ని ఏవిధంగా కాపాడుకున్నారు? పాతమాటలెందుకూ యిప్పుడు కూడా యెందరుఎన్నికష్టాల్లో తమ మానం నిలబెట్టుకోడంలేదు. ద్రౌపది కిట్టి వాంఛ లేకున్నా కవులందరూ 'తమ హృదయానుమానం'తో స్త్రీలనంతా చూస్తూ లేనిపోని కల్పనలుచేసి వాటి కంటగడతారు. 'పంచమే పతయస్సంతి మహ్యాం షష్ఠోపిరోచతే' అని ద్రౌపదిచే పలికించిన కవి ఎంత అనుమానాల బస్తానో ప్రపంచానికి తెలీదూ? దీన్ని వెనక వేస్కాని ఒక మహాకవి,

'భర్తాయద్యపి కామశాస్త్రనిపుణః విద్వాన్ కులీనోయువా,
దాతాకర్ణసమః ప్రసిద్ధవిభవః శృంగారదీక్షాగురుః।
స్వప్రాణాధికకల్పితా ప్రియతమా స్నేహేన సంవర్ధితా
తంకాంతం పశువద్విధాయతరుణీ జారంపతిం వాంఛతి॥

అని ధైర్యంగా అనేశాడు. ఆ మనువుకు తల్లీ చెల్లెళ్లు వున్నారో లేదో, (వుంటే కూడా దుర్మార్గులుగా వుంటారు లెండి) 'సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం సుతం....' అని ఏమేమో సెలవిచ్చారు. రామ! రామ!! ఇంతేనా, యీలాంటి వింకా యెన్నో వ్రాశినారు సిగ్గూ బిడియమూ లేకుండా.'

'కొంచం గుక్క తిప్పుకోనియ్యి.'

'ఇంకోక టేమంటే స్త్రీల ప్రస్తాపన వచ్చినపుడు వాళ్లను అధోలోకానికి తొక్కెయ్యడము తమ మాటవస్తే శ్లాఘనగా చెప్పుకోడమూను.''

'ఎవరు! ఎవరు!!'

'ఎవరో ఎందుకు మీ 'ఆంధ్ర కవితా పితామహ' అల్లసాని పెద్దన్నగారే. వారికెంత స్వాభిమానమో చూడండి. మనుచరిత్రలో ప్రవరుణ్ణి ఎట్లా వర్ణించారో. వాని విషపరాఙ్ముఖత యింద్రియనిగ్రహము బ్రహ్మతేజస్సూ—పైన పాదరసమూ! ఇక వరూథినిని—అమరకాంత కుండవలసిన—తుదకు సామాన్యస్త్రీకి వుండవలసిన—గుణాలన్నా లేకుండా, క్రొత్తమనిషి ఒకడు రాగానే నిర్లజ్జగా నిర్భయంగా నిరాఘాటంగా—ప్రవర్తించేటట్టు చూపి స్త్రీ లోకానికంతా కళంకం కల్పించినాడు. అల్లాంటి చెత్తబుక్కులంతా మీరు కళ్లకద్దుకొంటారు.'

'ఇదిగో.....నీ కింత ప్రజ్ఞవుందని ఈ క్షణంవరకూ యెరగను సుమా?'

'నా ప్రజ్ఞేంగాని, మరోమగవాని ప్రజ్ఞ చూచారూ. పాపం! పెద్దనకున్నంత యింద్రియనిగ్రహం భర్తృహరి మహాశయునికి లేదు.'

మ॥ నరకద్వారము, సాహసాకరము, పు
ణ్యస్వర్గ విఘ్నంబు, దు
స్తరమాయాశత పేటి, దంభనిధి, దో
షాధీన, మప్రత్యయో
త్కరను క్షేత్రము, కాలకూట, మమృతా
కారంబు స్త్రీయంత్రము ద్
ధర సెవ్వాడు సృజించె పూర్వమున శో
ధ్యంధ క్రియాపాశముల్.

అని చెడ ఏడ్చాడు. 'కర్మం కాలుపట్టి యీడిస్తే, మొగుడు మోకాలు పట్టి యీడ్చాట్ట' అన్నట్లు స్వర్గద్వారంనుంచీ వాళ్లను కాలుపట్టి యీడుస్తారు గాబోలు స్త్రీలు. 'ఆడలేక మద్దెలమీదపడి కొట్టుకుందిట' పూర్వం ఒకతె. తమ మనస్సును గట్టిపరచుకోలేక పైవారిమీదపడి అఘోరించడం. మీదుమిక్కిలి తమ చంచలతకు సిగ్గైనా పడడంలేదు. ఎవరన్నా అడిగితే 'విశ్వామిత్రపరాశరాదులే అట్లయినప్పుడు మన మేం లెక్కా జమా' అంటారు. 'బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి' అని వ్యాసుడు తెలియక చెప్పినాడా అని సమాధానం చెబుతారు. స్త్రీల విషయమైతే వంద ధర్మశాస్త్రాలు వ్రాస్తారు. ఏదో పాపం! 'అహల్య పొరపాటుతో యింద్రుణ్ణి వలచిందని గౌతముడు పూరికేవున్నాడా?'

'ముసలాడుగా మరి!'

మరో తమాషా విన్నారా! సీతమ్మ సొమ్ములు చిక్కినప్పుడు వాటిని ఆనవాలు పట్టేందుకు లక్ష్మణుని ముందు పెట్టాడట రాముడు. వాటిని చూచి 'నాకు మరేవీ తెలీవు. అందెలు మాత్రం ఆమెవని తెలుసు' అన్నాట్ట లక్ష్మణుడు. అంటే ఏమన్న మాట? ఎప్పుడూ ఆమె ముఖమే చూడలేదని. తెల్లవారగానే చూడవలసిన తల్లిలాంటి సీత ముఖం చూడలేదంటే ఏం కారణం? చూస్తే ఎక్కడ మనస్సు చలిస్తుందో అనే సందేహమే సుమండీ!! మగవాళ్లంతా 'అబ్బితే జుట్టు అబ్బకపోతే కాళ్లు' అనే రకం.'

'అల్పవిద్యవారు ఆక్షేపణకోరుట.'

'నిజమాడితే నిష్ఠూరమే లెండి.'

'అయితే పాతపుస్తకాలన్నీ తప్పంటావా.'

'అబ్బే!'

'మరి నీ భావం.'

'ఎవరిభావాలు వారికేవుంటాయి. స్త్రీలు పురుషుల్లాంటివారే. వారికీ హృదయము బుద్ధీ మానమూ లజ్జావున్నాయి. అన్నిటికీ మనస్సే కారణం కనుక మనోనిగ్రహం కలవారిని ఎవరేమి చేస్తారు? సమష్టిగా స్త్రీలను దూషించడం న్యాయం కాదు. పురుషులనైనా అంతే.'

'ఇంత న్యాయదృష్టి కలదానివని అనుకోలేదు సుమా నిన్ను. దీనికేదైన బహుమానం వద్దూ?'

'చాల్లెండి'

'ఇంతసేపూ లేనిసిగ్గు యిప్పుడువచ్చిందే'

# పుష్పచయము

**అనాథులపాలిట దైవముండడా?**

"చెరుపకురా చెడేవు" అను సామెత అందరు ఎరిగినదే. కాని ఎవరికిని తెలియనట్లు చాలమంది ప్రవర్తించుచుందురు; ప్రతిఫలము తగినట్లు పొందుచుందురు. ఈక్రింది యుదంత మొక నిదర్శనమేగాక యొంటరిగ ప్రయాణము చేయుచుండు స్త్రీల కొక పాఠముగూడ నేర్పుచున్నది. స్త్రీలు సాధారణముగా ప్రయాణము చేయునపుడు తమ ఆభరణములన్నియు ధరించియేయుందురు. తమ ధనమును నిరంతరము తమయొద్ద యుంచుకొనుట యుచితమని కొందరి తలంపై యుండవచ్చునుగాని యన్ని వేళలందును, ముఖ్యముగా తగుసహాయము లేక ప్రయాణములు చేయుటయందును ఆభరణముల గురించి శ్రద్ధవహించు టంతకంటె యుచితము. లేకున్న నష్టమును బొందుటయగాక ప్రాణాపాయముకూడ బొందవలసివచ్చును. ఇట్టి సమయములందు దేవునిపైనను, అదృష్టముపైనను, భారమువైచి తాము చేయవలసిన విధులను చేయకుండుట భావ్యముగాదు.

ఒక స్త్రీ టోంగాలో ఒకవూరినుండి మరొకవూరికి పోతోంది. ఆమెతోగూడ ప్రయాణం చేస్తున్న వారు దిగి వెళ్లిపోయారు. ఆమె ఒక్కతే పసిబిడ్డతో మిగిలివుంది. ఆమెవద్దో మొర్రో అని కొట్టుకుంటున్నా వినిపించుకోకుండా టోంగావాలా టోంగాను తోలుకువెళ్లాడు. పోయిపోయి అడవిదగ్గర నిలిపాడు. ఆమెమీదనున్న నగలు రొఖ్ఖం యివ్వమన్నాడు. అందుకు ఆస్త్రీ అంగీకరించనందువల్ల ఆమెను కాళ్లు చేతులు కట్టి పడవేశాడు. ప్రక్కనేవుండి గోలపెట్టుతూవున్న పసిబిడ్డను చంపడానికి దగ్గరలోవున్న పెద్దబండను యెత్తుకురాను వెళ్లాడు. బండను కదిలించాడు. దాని క్రిందనుండి మంచి త్రాచుపాము బుసకొట్టుతూలేచి వాడిని ఆడికొట్టడం. యెన్నిచోట్ల కఱచిందో లెక్కలేదు. వాడు వెంటనే మరణించాడు. దారినలోయేవా రెవరోవచ్చి తల్లిని, బిడ్డను రక్షించే వరకూ ఆపాము ఆ బిడ్డదగ్గరనేవుండి కాపాడుతోవుందట!

* * * *

**ధనమా? ఆరోగ్యమా?**

ఎవరైనను వివాహమాడ దలంచినచో ధన మతనికి మొదటి రేక మెండేషను. విద్యావంతులై కాలదేశపాత్రముల నెరింగినవారు నేడితర విషయములనుగూడ గమనించుచున్నను 'ధనమూల మిదంజగ' త్తను జాతికి జెందినవారందరు దానిదే ప్రాముఖ్యముగా నెంచి సంబంధములు జేయుచున్నారు. ఆర్థికదుస్థితిగల యీదినములలో నది

నిజమేనని తలిదండ్రులతో పాటు విద్యావతులైన యువతులుకూడ నదేదృష్టి గలిగియుండ వచ్చును. కాని ధన మెంత కరువైనదో దానికంటె కరువైన ఆరోగ్యసంపదను, ధనము కంటె ముఖ్యముగా గమనించు టత్యంతావశ్యకము. ఈవిషయమై జర్మని యువతులకు డాక్టరు గెట్టు ఒసగిన హితవు గమనార్హము.

జర్మనీలో లబక్ అనేపట్టణమున నార్డిక్ సంఘముయొక్క సాంవత్సరిక సమయమున రీచ్ అను జర్మనీ పార్లమెంటు మంత్రివర్గములో చేరిన డాక్టర్ గెట్టు అవివాహితలగు యువతుల కిట్లు కర్తవ్యమును బోధించెను.

మీ భర్తలను గోరుకొనుటలో మీ భర్తలు మంచి దేహారోగ్యముగల కుటుంబములోనివారై యుండు వారినిగా గోరుడు. ఆరోగ్యముగల భర్తకు ధనికుడై రోగియైన భర్త సాటిరాడు. భర్త సత్సంఘములోనివాడై యుండవలయును. వాడే యాదర్శప్రాయుడు. వానియొక్క మంచి నడవడియే వాని శరీరసౌందర్యమని తలంపుడు. ఐరోపాఖండపు పశ్చిమదేశములలోను, ఉత్తరపు దేశములలోను స్త్రీలు తాము అధోగతిపాలగునట్టిదారిలో నడుచుచున్నారు.

నీతినియమములకు లోబడు మనుష్యులతో జాతి యేర్పడవలయును. ఈవిధమైన జాతి యేర్పడుటకు పాలకులు దేశములో దోడ్పడవలయును. వ్యక్తులు సాంప్రదాయకులగు దంపతులగుటకు దోడ్పడవలయును.

జర్మనీలో వారి పూర్వీకులు వైవాహికజీవితకు పవిత్రతను సహకార మొనర్చిరి. నీతిధర్మమును నెంత గౌరవస్థితికి పైకి లేవదీయవలయునో నంత యెత్తునకు వారు లేవదీయగల్గిరి.

పూర్వాచారములను, జాతిధర్మములను, కులధర్మములను నడుపువారలుగ స్త్రీ లుండవలయును. జాతిలో నీతిమార్గ మభివృద్ధిబొందవలయునన్నచో అవివాహితలగు జవరాండ్రు ఆరోగ్యవంతము లయిన జాతులలోనుండు మగవారినే భర్తలుగా గోరుకోవలయును.

* * * *

## రష్యాలో స్త్రీలు చేయనిదేది ?

రష్యాదేశమునందలి స్త్రీలస్థితినిగురించి జూలైమాసపు సంచికయందు వ్రాసి యుంటిమి. ప్రపంచమంతటిలో స్త్రీ పురుషుల కెట్టి భేదమునులేని సంఘవ్యవస్థ యొక్క రష్యాదేశమునందే గలదు. ఈవిషయము రష్యాదేశమును స్వయముగ జూచిన వారెల్ల ప్రశంసించియున్నారు. రష్యాదేశమందు ప్రయాణమునల్పి యందలి పరిస్థితుల చక్కగ నెఱిగివచ్చిన డి. పి. పాండేగారు మాడరన్ రెవ్యూ పత్రికయందు వ్రాసినసంగతుల గమనించిన నది తెలియగలదు.

తన జనసంఖ్యలోని అర్ధభాగమగు స్త్రీలను, నిరుపయోగ జీవనమునుండి లేవదీసి, వారికి పనికల్పించి, వారిని మానవసంఘమునకు లాభకరములైన వ్యాపారములలో నియోగించి, ఒక నూతన సామాజికపద్ధతి నెలకొల్పుటయే రష్యావారు యితరులకు ఆదర్శప్రాయముగ నెరవేర్చిన మహత్తరమైన

కార్యము. స్త్రీలవలన జరుగవలసిన జాతీయ కార్యములకు ప్రపంచములో నింకేదేశమునందును యింత ప్రాముఖ్యత యివ్వబడుటలేదు.

రష్యను స్త్రీలు, అన్ని ఫ్యాక్టరీలలోను, బహుళముగా పని చేయుచున్నారు. ఏ వర్కుషాపు చూచినను వీరే కానవచ్చుచున్నారు. అందు ముఖ్యముగా, చేతిపరిశ్రమలో వీరు చేస్తున్న పనులు నిర్వహించుచున్న బాధ్యతలు, ఎట్టివారికైన ఆశ్చర్యమును కలిగింపక మానవు. స్త్రీలే, పెద్దపెద్ద డైరక్టర్లు, మేనేజర్లుగ కూడా, తమ నిర్వహణ సామర్థ్యమును ప్రదర్శిస్తున్నారు.

ఇంతెందుకు? లండనులో, మచ్చునకొక్క స్త్రీయైన ట్రాముబండిని నడుపుచున్నట్లు కనబడదు. ఇక మాస్కోలోనా, ట్రాము కండక్టర్లు, డ్రైవర్లుకూడా సర్వసామాన్యముగా స్త్రీలే!

రష్యాలోని అన్ని ప్రాంతములలోనూ స్త్రీలే విద్యావిభాగమును నడుపుచున్నారు. గవర్నమెంటులోని విద్యాశాఖలో, అన్ని పెద్దపెద్ద పనులను, స్త్రీలే ఆక్రమించుకొని యున్నారు.

వైద్యపరిశోధనా శాఖలోనూ, ఫిల్ము పరిశ్రమలోనూ, న్యాయవాద వృత్తిలోనూ కూడా స్త్రీలే అగ్రస్థానము లలంకరించుచున్నారు.

* * * *

## స్వాతంత్ర్య మరీకట్టినచో......?

సంఘమునందలి కట్టుదిట్టములను, మాతాపితల యిష్టాయిష్టములను కూడ లెక్కింపక యువతీయువకులమధ్య ప్రేమ జనించుట సహజము. వారంతట వివాహమాడగోరిన సాధారణముగ తల్లిదండ్రు లిచ్చగింపరు. ఇది యువతీయువకులకు స్వేచ్ఛ గలదన్న దేశములందే సాధారణమైయుండ నిక వారి వివాహమనునది తల్లిదండ్రుల యిష్టాయిష్టములపై నాధారపడియుండు ప్రాచ్యదేశములలో చెప్ప నవసరములేదు. ఐనను తల్లిదండ్రు లితరవిషయములతోపాటు తమతమ సంతానముయొక్క యిష్టాయిష్టములగూడ గమనించిన బాగు. లేకున్న యువతీయువకులు కోరుకొన్నవారిని వివాహమాడ సాధ్యముగాదని యెఱింగినచో సాహసములకుగూడ వెనుదీయరు.

ఫ్రాన్సు ప్రోవిన్సులో వుబాంగుపట్టణమున 16.19 యేళ్ల మధ్యవయసు గల తొమ్మిదిమంది కన్యలు కోరుకొనిన యువకులను పెండ్లియాడుటకు వారి తల్లిదండ్రు లంగీకరింపనందున వారందరును ఆ తొమ్మిదిమందిలో నొకయువతి యింటచేరి గ్రూపుఫోటో తీయించుకొనిరి. తరువాత నల్లమందు కలిపిన సారాను త్రాగిరి. అందువలన వారి కందరికిని స్మృతి తప్పిపోయినది. మరికొన్ని గంటలకొక నౌకరు గదిలోనికివెళ్లుట తటస్థించెను. వెంటనే వారినందరిని మోటారు అంబ్యులెన్సులలో హాస్పిటలుకు పంపిరి. వారికి ప్రాణభయము తొలగినదని మరునాడు డాక్టరులు తెలిపిరి.

రెండేళ్లక్రితము ఫ్రాన్సులో 11 మంది యువకులు యీకారణమువలననే ఒకరిచేతుల నొకరు పట్టుకొని నదిలో దుమికిరి. వారందరును మృతి నొందిరి.